# కర్మానుభవ పరిజ్ఞానము.

పండిత పామర హృదయాను

రంజకముగను, సుబోధకముగను,

ఉండునట్లు



బ్రహ్మశ్రీ గుడిగుంట లక్ష్మీపతి

గారిచే రచియింపఁబడి



మంజువాణీ ముద్రాక్షరశాలయందుముద్రింపబడి

ప్రకటింపఁబడియె

మొదటికూర్పు 1000 ప్రతులు.

 [వెల రు 0-4-0

# కర్మానుభవ పరిజ్ఞానము.

పండితపామర హృదయాను

రంజకముగను, సుబోధకముగను

ఉండునట్లు



బ్రహ్మశ్రీ గుడిగుంట లక్ష్మ

గారిచే రచియింపఁబడి

మంజువాణీ ముద్రాక్షరశాలయందుముద్రింపబడి

ప్రకటింపఁబడియె

మొదటికూర్పు 1000 ప్రతులు.



[వెల రు 0-4-0.

# పీఠిక.

మహాశయులారా!

కర్మ యనగా చేసిన సుకృత దుష్కృతములనియు నిట్టి సుకృత దుష్కృతములకుందగిన సుఖ దుఃఖ ఫలములనే మానవు లనుభవించుచుందురనియు నెల్లరును చెప్పుకొనుచునే యుందురు. ఈ ధర్మసూత్రము వేద శాస్త్ర పురాణేతి హాసములలో చెప్ప బడియే యున్నది. అయినను తత్కర్మ ఫల మనుభవమునకు వచ్చుతరిని యెంతటివారికిని దృఢపరిజ్ఞతృత్వము నిలువక కర్మ ఫలానుభవ సమాగమ మార్గమును సరిగా గుర్తెరుంగక తత్కర్మానుభవము చాలవర కిప్పటి లౌకిక వ్యవహారోత్పాదిత ప్రతిఫలమని యెంచి దానికిం దగిన ప్రతిక్రియాచరణారూపమున దుష్కర్మల నభివృద్ధి నొందించుట ప్రపంచమున పరిపాటిగ ప్రబలి నది. వేదశాస్త్రములలో కర్మ ఫలానుభవ విషయమై చేయ బడిన ప్రబోధము పలుతావుల పలువిధములుగ నుండి వాటినన్ని టిని చక్కగ సమన్వయము చేసుకొనినచో భావ మొక్కటియే యైనను, ఒక్కొకప్పుడు కొందరు పండితులుసైతము మీ కర్మాను భవ విషయమై పూర్వోత్తర సందర్భానుసారముగను, యుక్తా యుక్తముగను, సమన్వయము చేసుకొనజాలక తారుమారగు చున్నారు. అట్లనే నాతల్లిగారు తనయొక్కయు తనకు దృగ్గో చరమైన యితరులయొక్కయు సుఖ దుఃఖానుభవకాలములయం దిట్టి యనుభవము లిప్పటి ప్రత్యక్ష లౌకిక ప్రయత్న ప్రతిఫల ములా? పూర్వకర్మ ఫలములా? వీటి సంబంధ మేమియులేక నే దైవము కలుగజేసెడి యనుభవములా? అను సంశయములు తనకు చిరకాలమునుంచి మనస్థాపితములై యున్నవనియును ఈ సంశయముల నివృత్తికై యప్పుడప్పుడు తటస్థపడుచుండు పెద్దలు

విద్వాంసులు మున్నగువారలతో ప్రసంగించుచుండినను పలువురు పలురీతుల జెప్పుటయేగాని సంతుష్టిపూర్వకమైన సంశయనివృత్తి కాలేదనియును, శంకకు తావీయని సమాధానపూరితమగు కర్మానుభవ పరిజ్ఞానమెరుకపడ గుతూహలము కలదనియు నొకప్పుడు నాతో ప్రస్తాపించియుండుటంజేసి యప్పటనుంచియు కర్మానుభవ విషయమున సద్గ్రంధములయొక్కయు పలువురు విద్వాంసుల యొక్కయు ప్రబోధములను, ప్రత్యేక ప్రత్యేకాభిప్రాయములను, గ్రహించి నాబుద్ధిబలమునకుతగినంతటి యోచనవలనను నాప్రత్యక్షానుభవమువలనను వాటికోగల పరస్పర విరుద్ధములను సమన్వయము చేసి కర్మానుభవ విషయిక పరిజ్ఞానము సిద్ధాంతపరచి అట్టి సిద్ధాంతమును తాత్కాలికోపమానములతోడను, దృష్టాంతములతోడను, పూర్వపక్షసిద్ధాంతావసరసందర్భముల సమయానుకూల స్వకపోలకల్పనలతోడను, యుక్తియుక్తముగ నాతల్లిగారికీ కర్మానుభవ పరిజ్ఞానమును అప్పుడప్పుడు బోధించుచు వచ్చితిని. ఇందుచెప్పబడిన విషయములన్నియు నామె పరిపూర్ణముగ గ్రహించిన పిమ్మట తనకు కర్మానుభవ సిద్ధాంతముపట్ల సంశయనివృత్తియై సుఖదుఃఖానుభవ కాలములయందు మోదఖేదములు లేని సమభావనారూపమైన యాత్మశాంతి కలిగెననియు నీపరిజ్ఞానములో కహితార్ధము ప్రచురించవలసినదనియు దాదాపు రెండుసంవత్సరముల గతకాలమున నాకాజ్ఞాపించియుండెను. నాతల్లిగారి యాజ్ఞానుసార మతిశీఘ్రమున నీగ్రంధప్రచురణమొనర్ప నత్యంతకుతూహలము కలిగినవాడనై యున్నను తత్ప్రయత్నమునకు తావీయనికొన్ని యితరవ్యవహారాది సందర్భములవలన కాలయాపన మయ్యెను. ఇంతలో కర్మానుభవకాలాను సరణిని యెను బదిసంవత్సరములు పైదాటిన వయస్సుగల నాతల్లిగారు

దుర్మతినామసంవత్సర భాద్రపద శుద్ధ తృతీయా భానువారము నాఁడుదయమున (4-9-1921) మహావ్యక్తితో ననాయాసముగ భౌతిక సంబంధమైన కర్మకళేబరము నొక్క నిమేషకాలమ్మున బరిత్యజించి శాశ్వతాత్మానందానుభవ భోక్త్రియై పరమపదము నధిష్టించెను. నాతల్లిగారి జీవితకాలమున నామె యాజ్ఞానుసార మీగ్రంథ ప్రచురణమొనర్పజాల నైతినని కడుంగడు జింతించి యింతనైన ద్విరపమట కర్తవ్యంబని నిశ్చయించి నమాతుః పర దైవతం, అను ప్రమాణమునను నాయనుభవమువలన బ్రత్యక్ష దైవముగ నాకుకలిగిన నమ్మకమునను నాతల్లిగారికీ కర్మానుభవ పరిజ్ఞాన గ్రంథము నంకితముచేసి కృతిసమర్పణముచేసి ముద్రిం పించి ప్రచురించితి. నేనొక గొప్పవిద్వాంసుడను గాని చిరకాల లోకానుభవజ్ఞుడనుగాని కాను. అట్లు కాకపోయినను పైనచె ప్పిన కారణములనుపట్టి నానేర్చినరీతిని రచించిన కించిజ్జ్ఞుడనైన నాయీగ్రంథరచనమునందేవైన స్ఖాలిత్యములుగాని శాస్త్రానుభ వవ్యత్యస్తాంశములుగాని యున్నయెడల పాఠక మహాశయులు దయతో మన్నించి యట్టివాటిని సహేతుకముగ నాకుఁదెలిపిన యెడల రెండవ కూర్పు నందట్టి లోపములను సవరించి ప్రచు రించెదను.

ఇట్లు గ్రంథకర్త

గుడిగుంట లక్ష్మీపతి.

## దైవప్రార్థన.

శా. శ్రీకళ్యాణ గుణాకరాత్రి భువనశ్రేయః ప్రదాసర్వలో
కైకాధార జగన్నియంత పరమాత్మా సాక్షీ హేనిర్వికా
రాకారుణ్య పయోనిధీ భవభయార్తధ్వంస సచ్చిత్స్వరూ
పాకాలత్రయ వేదిబ్రోవుమను నాభావార్థ సంసిద్ధిగన్.

## మాతృవందనము.

మ. నవమాసమ్ములు గర్భగోళమున నన్నాసక్తి మైనుంచి ప్రా
భవమొప్పంగ దశేంద్రియమ్ములను జీవత్వమ్ము గల్పించి యి
భ్భువిపై నన్ ప్రసవించి శైశవ మహాంభోరాశి దాటించి సౌ
ష్టవలీలన్ ననుబెంచె నట్టిజననిన్ సాష్టాంగతన్ మ్రొక్కెదన్.

## కృతిసమర్పణము.

మ. శ్రితకౌండిన్యస గోత్రసంభవల సచ్ఛ్రీభోగరాజాన్వయా
క్తిత పేర్రాజతనూజ గౌతమసగోత్రీందోద్భవానూనశో
భితసుశ్రీగుడిగుంట వంశజుడు మత్పిత్రుండు నౌ అంతయా
ర్యతనుర్భాగిని యైనమజ్జనని సత్యైకాన్నపూర్ణాంబకీ
కృతి నర్పించితి నాత్మశుద్ధిగను నాకీజన్మ సాఫల్యమై
క్షితిలో నెల్లరు కర్మతత్వ ఫల సంశీలజ్ఞతన్ వర్తిలన్.

## ఆశీస్సు.

శా. అమ్మా నీఋణమెల్ల దీర్పగ నశక్యంబౌగదా నాకుకా
నిమ్మాకోటికి గోవృతోకవలె నేనీకిచ్చితీ సత్కృతిన్
ముమ్మారున్ ఋణముక్తపుత్రునిగ నామోదించిదీవించుమా
యమ్మా దీననికీర్తిశేషిణివి గమ్మా చంద్రతారార్కమున్.

శ్రీ వెంకటేశ్వరస్వామినేనమః.

# కర్మానుభవ పరిజ్ఞానము.

పరమేశ్వరునిచే సృజింపబడిన సమస్త జీవరాసులలోను మానవజన్మ శ్రేష్టమని యెల్లరు నెరింగిన యంశమేయైయున్నది. గాని యిట్టి శ్రేష్టత్వమును మనుష్యజాతికి ఆరోపణచేయుటకు గల కారణములను సమగ్రముగ నెరిగియుండని వారలు కొందరుందురని యొప్పుకొనకతప్పదు. ఇట్లనుటవలన మానవజన్మ శ్రేష్టము కాదని చెప్పువారలు కొందరున్నారాయని శంకపొడమవచ్చును. అట్లు శ్రేష్టముకాదని చెప్పువారలు లేరుగాని మానవజన్మ శ్రేష్టమగుటకు గల కారణము లెవ్వియో పూర్ణముగ దెలసికొని అట్టి కారణముల నాచరణకు తెచ్చుకొని అట్టి శ్రేష్టతమమగు మానవోచితధర్మముల నతిక్రమించక విడనాడక యధాక్రమముగ యిహపరములనార్జించు ప్రజ్ఞను కలిగి యున్న వారలరుదుగనుందురు. ఒక్క మానవజాతి విషయమే కాదు. శ్రేష్టతరమని నోటితో చెప్పెడి యేవస్తువునైనను అట్టి శ్రేష్టత్వమునకు గలకారణమును దాని నుపయోగించు విధి విధానముల నెరుగకపోయిన నావస్తువునందలి శ్రేష్టత్వమా మానవునిపట్ల వ్యర్ధమగును. లోహములందెల్ల శ్రేష్టత్వము వహించిన బంగారునుపయోగమునకు తెచ్చుకొను విధానమెరుంగని బాలునిభంగి యున్నామని రీతి పశ్వాదులకరణిని జీవరాసులయందెల్ల శ్రేష్టత్వము వహించిన మానవజన్మవలన నాచరించ దగు కృత్యములును అనుష్టించవలసిన విధానములును. పొంద దగిన పరిజ్ఞానమును యధావిధ్యుక్తముగ ననుభవమునకు తెచ్చు

కొని యాచరింపని వానికి మానవజన్మముయొక్క శ్రేష్టత్వము నిష్ప్రయోజనమగును. మనోబుద్ధి చిత్తాహంకారములనెడి అంతఃకరణ చతుష్టయముయొక్క సమ్మేళన విభజనసమర్థమును యుక్తాయుక్తవివేచన పరిజ్ఞానమును, తన్నియుక్తకార్య నిర్వాహకసామర్థ్యమును కలుగజేసి మానవజాతికి జీవరాసులందెల్ల శ్రేష్టత్వము నొసంగిన పరమేశ్వరుని యుద్దేశ్యమును గ్రహింపనేరక అయుక్తకార్యాచరణమునందును యుక్తకార్యవిసర్జనమునందును వివేకపరిత్యాగమునందును తమకార్యనిర్వాహకసామర్థ్యమును వినియోగపరచి మానవజన్మ శ్రేష్టత్వమునకు హానికలిగించుకొని యితరవస్తుసంపుటితో కరగించబడి వన్నెతగ్గిన బంగారువలె విలువచెడి సత్త్వరహితులై మానవనామధారణమాత్రులైన మానవులు పరమేశ్వరుని దృష్టిలో పశుపక్షి సరీసృపాదులకంటె హీనముగ పరిగణింపబడుచుందురు. ఏలనన పశుపక్షిసరీసృపాదుల ప్రవర్తనాచారాహారాది, విధివిధానము లెట్లు నియమింపబడెనో యట్లే వాటి జీవితాంతము వరకును వ్యత్యాసము దొరలకుండ సక్రమముగ జరుగుచుండును. అట్టి పశుపక్షిసరీసృపాదులకంటె యుక్తాయుక్తవివేచనా పరిజ్ఞానమును కార్యనిర్వాహక సామర్థ్యమును కలిగియున్న మానవులు యుక్తాయుక్తవివేచనను వీడి తమకార్యనిర్వాహక సామర్థ్యమును భగవదుద్దేశ్యమునకును మానవోచిత ధర్మమునకును వ్యతిరేకముగ తమ ప్రవర్తనాచారాహారాది విధుల నెరవుచుండెడి మానవులు పరమేశ్వరుని దృష్టిలో హీనముగ పరిగణింపబడుదురని యొప్పుకొనుట నిర్వివాదాంశము. పరమేశ్వరునిచే ఆదియందొక టిగానుత్పన్నము చేయబడి సమానవాత్సల్యము జూపబడిన మానవసముదాయము నందు ప్రబలిన వ్యత్యాసాచారాహారాచర

ణలవలన ఆధిక్యానాధిక్య భేదము లేర్పడుటయేగాక నానా యోని సముత్పన్నాది జన్మ జన్మాంతరములును దుఃఖానుభవ ములును తద్వ్యత్యస్తాచరణ ఫలముగ నాయా జీవుల యనుభ వమునకు సిద్ధపడు నట్లా పరమేశ్వరుడే శాసించి యున్నాడు. సంతాన మందరియెడలనాది యందొకేవిధమగు ప్రేమానురాగ ములున్నను విద్యాభ్యాసము పట్లను తదితర ప్రవర్తనావిధుల పట్లను జనకుని యాజ్ఞలనతిక్రమించి జనకుని ప్రేమానురాగోద్దే శ్యములను సమగ్రముగను సక్రమముగ నెరుంగజాలక స్వేచ్ఛా విహారులై వర్తించిన కొలదిని జనకుని ప్రేమానురాగములు మారి జనకుని యనుగ్రహమునకు మారుగ నాగ్రహమునకు పాత్రులై తమ విద్యావిహీనా వివేకదుష్ప్రవర్తనలకుందగిన ప్రతి ఫలమునొంది కుందుచుండెడి మానవులననేకులను మనము చూచుచున్నాము. ఇట్టి మనుజులయెడ తండ్రులకు ప్రథమ మున ప్రేమానురాగములు లేక పోలేదు. తగినంతమంచిబోధను చేసియు సౌఖ్యదాయకమును పురోభివృద్ధి కరములునగు మార్గ ముల ప్రవేశపెట్టియు నట్టి ప్రక్రియలనన్నిటిని వ్యర్థపరచి దుష్ప్ర వర్తకులైన సంతానములయందు జననీజనకులు క్రమక్రమము గను తుదకు పూర్తిగను ప్రేమానురాగ వాత్సల్యములను వీడు దురు. అట్టి సందర్భమున సంతానము వారి వారి దుష్ప్రవర్తన లకుందగిన అగౌరవాసౌఖ్యాది ఫలముల గుడుచుచుందురు. అట్లనే పరమేశ్వరుడును మానవులయందు ప్రప్రథమమున పరి పూర్ణవాత్సల్యానురాగములు కలిగియున్నను పరమేశ్వరాజ్ఞాని బద్ధులై సదాచార ప్రవర్తకులు కాని మానవుల యెడ పరమేశ్వ రుని వాత్సల్యము క్రమక్రమముగను తుదకు పూర్తిగను వీడి వారి వారి ప్రవర్తనాచారాది విధులచేనాచరింపబడిన దుష్కృత

ములకుం దగిన దుఃఖఫలమునే యనుభవించుచుందురు. తలి దండ్రుల యాజ్ఞానుసారము వర్తించిన సంతానము జననీజనకుల వాత్సల్యానురాగ పూరితులై గౌరవ సౌఖ్యములనొందెడి రీతిని భగవదుద్దేశ్యాజ్ఞాను సారముగ ప్రవర్తించిన మానవులును భగ వద్వాత్సల్యానురాగ పరిపూర్ణులై వారిచే నాచరింపబడు సత్క ర్మానుష్ఠానమునకుందగిన సుఖఫలము ననుభవించుదురు. ఇట్లు చెప్పుటచేత సంతానముయొక్క దుష్ప్రవర్తనలవలననే జననీ జనకులు ప్రేమానురాగముల వీడుదురని నిశ్చయపరచవలను పడ దనియు జననీ జనకుల దుష్టత్వ దురాచారాదుల వలన గూడ కొన్నిచోట్ల సంతానము నందనవసర క్రోధములబూనుటయు తద్వారా సంతానమునకును జననీ జనకులకును దీర్ఘ వైరము లును పరస్పరాన్యాయలును కలుగుచుండుట గూడ గలదనియు ను అట్లనే పరమేశ్వరుడును మానవులయెడ ననవసరాగ్రహావేశ మును బూని వేధించుచుండునని చెప్పకూడదాయనియును శం కించవచ్చును. ఇట్లూహించుట సరియయిన వివేకముకాదు. ఎందువల్లనంటే—

సంతానము, జననీజనకులు, నను ఉభయపక్షములవారు ను మానవులేయగుటవలన సహజప్రేమానురాగములు కలవారే యైన నొకానొకసందర్భమున జననీజనకులుగూడ దుర్మార్గోద్దేశ్యు లును దురాచారప్రవర్తకులునైనకావచ్చును. పరమేశ్వరుని విష యమట్లుకాదు. యెల్లప్పుడును పరమేశ్వరుడు ద్దేశ్యమునందు ను ప్రవర్తనయందును న్యాయమునందును జగత్పరిపాలనయం దును నేమరపాటుగాని మరపుగాని అన్యాయముగాని అశ్రద్ధ గాని లేని మహాశక్తివంతుడు అతడు సర్వాంతర్యామి జగన్ని యంతపరిపూర్ణుడు నిర్వికారుడు జగత్సాక్షియునై యున్నాడు.

ప్రాణికోటులు బహిరంగముగాచేసిన కార్యములనేగాక గూఢముగాచేయు కార్యములను, హృదయాంతర్గతములగు యోచనలను కోరికలను సైతమాతడు తెలుసుకొనగలడు. ఇట్లు తనకుగల సర్వశక్తిసంపన్నత్వముచే ప్రాణుల సుకృత దుష్కృతములను తెలుసుకొని తనకుగల జగన్నియంతత్వాది సామర్థ్యములవలన నాయాప్రాణుల కాయాసుకృత దుష్కృతములకుం దగిన సుఖదుఃఖఫలముల ననుభవమునకు వచ్చునట్లు నియమించుచుండును. ఇట్లు పరమేశ్వరునిచే నియమించబడిన కర్మఫలానుభవనియామకమున కడ్డుగాని వ్యత్యస్తముగాని యేసందర్భములోను ఏరీతిగాను కలుగదు. సత్కర్మకు సుఖఫలమును దుష్కర్మకు దుఃఖఫలమును అనుభవించియే తీరవలెను. ఇట్లు మానవులు తాముచేసిన కర్మల ఫలానుభవకాలములయందు సుఖానుభవము తమప్రయత్నాచరణా కౌశలత్వమున లభించెనవియెడి సర్వజ్ఞత్వమును వహించుటయును దుఃఖానుభవము దైవముచే సంఘటనచేయబడెననియు లేక పరులు చేసిరనియు నిత్యాది నిందారోపణములను చేయుటయును మానవులకు సహజగుణములై యున్నవి. ఇట్లు తలంచుటకు కర్మపరిజ్ఞాన శూన్యత్వమే ముఖ్యకారణముగ నున్నది. తమ యనుభవమునకు వచ్చు కర్మఫలమును పరమేశ్వరుడు నిష్పక్షపాతముగను న్యాయముగను నియమించునేగాని తాముచేయుని కర్మలకు దుఃఖఫలమునుగాని సుఖఫలమునుగాని అనుభవమునకు వచ్చునట్లు నియమించడు. నేరముచేసిన మనుజుని దండనాధికారి నిష్పక్షపాతముగను న్యాయముగను విమర్శించి నిజమును తెలుసుకొని చేసిననేరమునకు తగినశిక్షను విధించినపుడు ఆశిక్ష ననుభవించువాడు తానుచేసిన నేరమునకు ప్రతిఫలముగ ననుభవించుచున్నానని సమ్మతినొందుట యు

క్తముగాని దండనాధికారి శిక్షించినాడని చింతించుట, నిందించుట వట్టియవివేకమును, మూర్ఖత్వమును, పరిహాసాస్పదమునని, అందరు నొప్పుకొనతగిన విషయమే కదా? మనకు ప్రత్యక్షముగ కనుపించు దండనాధికారి సాక్షులవలన నేరమును నిరూపణచేసి శిక్షను విధించుచుండుటవలన నొక్కొక సందర్భములయందు న్యాయాతిరిక్తము కావచ్చును. పరమేశ్వరుడు, జగత్సాక్షియు నియంతయు గూడనై యున్నందునను, ప్రపంచమునందలి మానవులవలెగాక, యీర్ష్యాసూయాస్వలాభపక్షపాతాది దుర్గుణరహితుడగుటవలనను పరమేశ్వరుని నియామకానుసారముగ ప్రాప్తించు దుఃఖానుభవము తమతమ దుష్కర్మఫలమని నిర్వివాదముగ నిస్సంశయముగ నప్పుకొనదగియున్నది. ప్రభుశాసనానుసారముగ రాజ్యాంగతంత్రము నిర్వర్తించువారలకును పాండితీ సాంప్రదాయముగ సదాచార సత్కర్మానుష్టాన తత్పరులైన వారలకును గోభూహిరణ్య వేతనాదులవలన ప్రభుసన్మానము కలుగుచున్నట్లే పరమేశ్వరోద్దేశ్యానుహితములైన సచ్ఛాస్త్రవేద చోదిత విధివిధాన సత్కర్మానుష్టాన భూతదయేత్యాది మానవోచిత ధర్మ సుగుణగణాభరణ పరోపకార పారీణులైన మానవులు చేయు సత్కర్మలకు పరమేశ్వరుని నియామకానుసార సుఖానుభవమట్టి మానవుల యనుభవమునకు వచ్చుచుండును. ఏరీతిని యోచించినను పరమేశ్వరుడుసాక్షిగను నియంతగ నున్నాడేగాని మానవుల యనుభవమునకు వచ్చు సుఖమునకుగాని దుఃఖమునకుగాని కారణ మామానవు లొనర్చిన సుకృత దుష్కృతములే యై యున్నవి. వీటికే కర్మబీజములని పేరు. ఈబీజము లమోఘములైనవి. సత్తాప్రదములైనవి. భూమియందు నాటిన బీజములలొకొన్ని సతారహితములయ్యును నిస్సారప్రదేశములయందు

నాటబడినవయ్యును మొలకలెత్తక నశించును. యీకర్మబీజము లట్లుకాదు. పరిపూర్ణసత్తాప్రదములు. ఏయేమానవుల హృదయములట్టి కర్మలను చేయుటకు ప్రథమమున సంకల్పించెనో ఆహృదయఫలకములే ఆకర్మబీజములకు క్షేత్రములు. ఆకర్మబీజములు క్రమేణ వృక్షములై పుష్పఫలపరిశోభితములై ఫలపరిపక్వకాలమున, సుఖరూపముననో, దుఃఖరూపముననో, అనుభవమునకు వచ్చునపుడా యనుభవముయొక్క రుచిని గ్రహించి సంతసమో లేక సంతాపమో పొందవలసిన వాహృదయఫలకములే యై యున్నందున కర్మబీజావాపనపట్ల నాహృదయక్షేత్రము లెన్నడును నిస్సారములుకావు. కావున మానవుల సుఖదుఃఖములకింత బలవత్తరఫలకారణమైన కర్మయొక్కతత్వమును, తత్కర్మఫలమనుభవమునకు వచ్చు మార్గములును అట్టిఫలానుభవకాలమునను౦డవలసిన పరిజ్ఞానమును సంతుష్టియు ప్రతిమానవుడును తెలుసుకొనియుండుట అత్యావశ్యకము ఏదిమానవుల సుఖదుఃఖములకు ముఖ్యకారణమో అట్టికర్మవిషయిక పరిజ్ఞానమును పరిపూర్ణముగ నార్జించిన మానవుడు సుఖదుఃఖానుభవకాలములయందు మోదఖేదములులేక సమదర్శనుడై ఆత్మశాంతిని గోల్పోవక క్రమక్రమముగ సుఖానుభవకారణకర్మల నాచరించుచు తానుగాను నిర్వికారుడై, నిష్కాముడై, నిర్గుణుడై, ఈశ్వరతత్వవేదియై, పరబ్రహ్మైక్యానుసంధానుడగును. ఇట్టి పరమోత్కృష్టపదవి నొందవలెననియే యెల్లరును కోరుచుందురు. గాని కర్మపరిజ్ఞానశూన్యులైనవారలు తమకుప్రాప్తించిన సుఖఫలానుభవకాలమున అమితానందపరవశులై అట్టిసుఖానుభవము వారి తాత్కాలిక ప్రత్యక్ష లౌకిక ప్రయత్నములవలన లభించెనని విర్రవీగుచును దుఃఖఫలానుభవకాలమున నత్యంత సం

తాపానలనిమగ్నులై యుక్తాయుక్త వివేచనారహితులై పరులవలనను దైవమువలన నిట్టిదుఃఖఫలము సంప్రాప్తమయ్యెనని దూరుచును కాలముగడుపుచు అనుభవఫలమునకు ముఖ్యాధారమైన కర్మతత్వము నెరుంగజాలక శోచినరీతిని పునఃపునః కర్మబీజముల వృద్ధినొందించుచు తత్తత్ఫలభోక్తృత్వమున వగపునొందుచుందురు. తాము జీవించి యుండువరకును సుఖమనే యనుభవించుచుండవలెననియును, జీవితాంతమున శాశ్వతానందకరమగు ముముక్షుత్వములభించవలెననియు కోరికలున్నంతమాత్రమున లాభములేదు. తమకుకలిగియున్న యీకోరికలు సఫలమగుటకు కర్మతత్వమును తెలుసుకుని సత్కర్మానుష్ఠానమునగానుకర్మలుచేయువారలు కావలెను. అట్లు తానుచేయు కర్మలే తనయనుభవమునకు వచ్చునని పైన చెప్పబడుచున్నది.

దుఃఖపరిణామమైన యాపదలుగాని సౌఖ్య పరిణామమైన సంపదలుగాని ప్రతిమానవునకును పూర్వకర్మాను సంధానముగ దైవప్రేరణము కతనవయ్యె యనుభవకాలమున బలాత్కారముగ లభ్యమగుచుండును. బలాత్కార మనగా సుఖముగాని దుఃఖముగాని తన కక్కరలేదని చెప్పినను వదలక యనుభవమునకు వచ్చుననుట. ఇట్టి సుఖ దుఃఖములు, కలిమిలేములు, ఆరోగ్యానారోగ్యములు, మానావమానములు మొదలుగాగల ద్వంద్వములు వారు వారు చేసిన పూర్వకర్మను బట్టి తత్కర్మానుసారమైన ఫలమనుభవించుటకై సిద్ధపడును. పూర్వకర్మయనగా పూర్వజన్మమునందు చేసిన కర్మయని మాత్రమె యెంచదగదు. తనయనుభవమునకే దేని సుఖముగాని దుఃఖముగాని వచ్చుకాలమునకు వెనుకటి కాలమున చేసిన కర్మయని యభిప్రాయము. ఇట్టి పూర్వకర్మానుభవమునకే, ప్రారబ్ధమని పేరు. "ప్రార

ద్ధంభోగతోనశ్యేత్ " ప్రారబ్ధము అనుభవించుటవలననే నశిం చవలెను, గాని వేరు విధముగ ప్రారబ్ధము క్షయముకానేరదు. అందు వలననే యేమనుజుడెట్టి యనుభవమునకు తగిన కర్మ బీజమును నాటియుండెనో యట్టి బీజము క్రమేణ వృక్షమై పుష్పఫలవంతమై ఫలపరిపక్వకాలమున నామనుజుని యనుభ వమునకు సిద్ధమగును. ఈకర్మబీజము ఫలపరిపక్వమగునట్టి కాల పరిమితి కొన్ని సందర్భముల దీర్ఘమును మరికొన్ని సందర్భముల హ్రస్వమును కావచ్చును. దీర్ఘహ్రస్వకాల భేదములచే ఫల పరిపక్వమగుటకు కారణము, ప్రథమమున నాటబడిన కర్మబీ జము యొక్క శక్తిని బట్టియుండును. భూమియందు నాటబడిన బీజములలో కొన్ని కాలవిడంబనమున గాని మొలక యెత్తవు. కొన్ని యతిశీఘ్రకాలములో మొలచును. మొలచిన పిమ్మట గూడ వృక్షములగుటకును, వృక్షములై నపిదప ఫలవంతములగు టకు నట్టి కాలవ్యత్యాసము యిన్నిటిలోను కానవచ్చుచుండును. దృష్టాంతముకొరకు కొన్ని వృక్షభేదముల నిందు వివరించెదను. నారికేళ బీజము భూమియందు నాటిన మూడు మాసములకుగాని మొలక యెత్తదు. మొలక యెత్తిన సంవత్సరమునకుగాని రెండు మూడాకులు వేయదు. పిమ్మట రెండు సంవత్సరములకుగాని మాను కట్టదు. పిదప మూడు సంవత్సరములకుగాని కాయలు కాయదు. కావున బీజము నాటినది మొదలెనిమిది సంవత్సరము లకుగాని ఫలవంతము కాజాలదు. కదళీవృక్షము నాటిన్న నెలరో జులలో మొలకయెత్తి యింక రెండు నెలలకు వృక్షమై యారు మాసములకే కాయలు కాచును. ఇంక నతిస్వల్పకాలములో ఫలవంతములగు వృక్షజాతులు కూడ గలవు. పొట్లకాకర మొ దలగునవి నెలదినములలో ఫలవంతమగును. నారికేళవృక్షము

కన్న దీర్ఘకాలమునకు గాని ఫలవంతములుకాని వృక్షజాతులు కూడ గలవు. ఇట్టి కాలభేదఫలప్రదాయికత్వమునకు బీజజాతి కారణమై యుండును. కావున యీరీతిగనే చేయబడిన కర్మ యొక్క గురుత్వల ఘుత్వములను బట్టి కాలవ్యత్యాసమును, అనుభవ ఫలనిరూపణమును అనుభవ కాల పరిమాణము నేర్పడియుండును. ఇట్టి కర్మానుభవము సుఖరూపమునగాని దుఃఖరూపమునగాని విధ్యుక్తకాలమున వచ్చుచుండుటయే దాని పని గాని ఆకాలమున సత్కార్యాచరణ చేయుచున్నాడా? లేకదుష్కార్యాచరణ చేయుచున్నాడా? యని విచారించుట కర్మానుభవ ఫలమున కవసరములేదు. కర్మఫలము విధ్యుక్తకాలానుసరణిని, సత్కార్యములనుచేయునప్పుడు దుఃఖఫలమును దుష్కార్యములను చేయునపుడు సౌఖ్యఫలమును గూడ ననుభవమునకు వచ్చినరావచ్చును. అట్లు వచ్చుచుండుటచే సత్కార్యావలంబకుల కాపదలు వచ్చుచుండుననియు దుష్కార్యావలంబకులకు సౌఖ్యములు కలుగుచుండుననియు మతిభ్రమనొందగూడదు. యేకర్మల నాచరించు వారికే యేఫలములెప్పుడు వేళలలభ్యమగునో కర్మవిపాకాది గ్రంథములయందు సవిస్తరముగ దెలుపబడియున్నది. అందు వల్లనే పుణ్యకార్యములు చేసిన సౌఖ్యఫలమనుభవించవచ్చుననియు, పాపకార్యములు చేసిన దుఃఖఫలమనుభవించి తీరవలెననియు పుణ్య పాపకర్మఫలములు సుఖదుఃఖరూపముల ననుభవింపక తీరదనియు పెక్కుశాస్త్రములు ద్యోతింపించుచున్నవి. ఇట్లు చెప్పుటచేత ప్రపంచమునందలి కుతర్కవాదుల వాదనాంశమునకును దుష్ప్రవర్తకుల యాచరణాంశమునకును గొప్ప యాధారము చిక్కినదని సంతసింతురు. ఏమంటే—

ఒకదుష్టుడొకనినికొట్టి వానిద్రవ్య మపహరించును. అట్లపహరించుట తప్పుకాదనియు దెబ్బలుపడుటయు ద్రవ్యమును కోల్పోవుటయు వానికర్మానుభవములనియు నందువలన తాను పాపకర్మ చేసినవాడనుకాలేదనియు నొకయుక్తినికల్పించును. అట్టియుక్తి సరికాదు. దెబ్బలుపడుటయు, ద్రవ్యమును కోల్పోవుటయు వాని కర్మానుభవములేగాని వానిద్రవ్యము నపహరించుట తనకు న్యాయమైన అవసరము లేకపోవుటవలనను తనవలననే వానికర్మ యనుభవమునకు రావలసియున్నదని నియమింపబడియుండకపోవుటవలనను ద్రవ్యము నపహరించినవాడు పాపకృత్యము నాచరించినవాడగుచున్నాడు. ఇట్లుచెప్పుటచేత దెబ్బలుపడుటయు ద్రవ్యమును గోల్పోవుటయు అనుభవించినవాని కర్మానుభవములేయని సమ్మతించినపుడట్లు వానికీయనుభవమును సంఘటింపజేయుటకు నేను నియమింపబడలేదని యెట్లుచెప్పవచ్చుననియు నావల్లనే వానికట్టి దుఃఖానుభవము సంఘటించుటకు దైవముద్దేశించినందుననే నాకీపనియందు బుద్ధి స్ఫురించినదని యెవ్వరొనదగదాయనియును ప్రశ్నించును. ఈవిషయ నిర్ధారణ మతిగాంభీర్యమైనది. నిర్మలమైనమనస్సుతో యోచించదగినది. యెట్లంటే, ఒక దుఃఖానుభవకారణమైన దుష్టకర్మచే పరులకు సంతాపము కలుగజేయవలసినదని పరమేశ్వరు డొకమనుజుని ప్రోత్సాహము చేయునాయను అంశమిచట విచారణీయము. ఈవిషయమిచ్చట చక్కగ విమర్శించినచో పరమేశ్వరుడు సకల సద్గుణసంపన్నుడును పరమదయాసముద్రుడునై యున్నందున ప్రపంచమునందలి మానవు లాచరించదగిన మానవోచితధర్మము లన్నియు వేదశాస్త్రములవలన నుద్ఘోషించి బోధించెననియు అట్టి ప్రబోధమునందలి సారాంశమే మానవోచితధర్మమైన న్యాయా

వసర నిబద్ధ కార్యాచరణమనియు ఏమాసపునియైన ధర్మాతిరిక్త
ముగ దుష్టకార్యముల నాచరించుటకు ప్రబోధమిచ్చియుండలేద
నియు, ఇట్లగుటవలన పరపీడనాకరమగు దుష్టకార్యాచరణమున
కై పరమేశ్వరుడు తనను నియమించి తనకు ప్రోత్సాహ మిచ్చి
యుండలేదనియు స్పష్టపడును. తానాచరించిన దుష్టకార్యము పర
మేశ్వర ప్రబోధోచిత నిర్మలధర్మమునకు వ్యతిరేకమై యుండుటయే
గాక తననిట్టి దుష్కార్యమును చేయవలసినదని పరమేశ్వరుడు
తనతో స్వయముగ చెప్పినాడని యీకుతర్కవాదియుగూడ
చెప్పలేడుగదా? ఇదియునుంగాక తానితరుని ద్రవ్యము నపహరిం
చ నుత్సహించుతరుణమున తనకు బోడమిన ద్రవ్యాసక్తియు
తద్ద్రవ్యాపహరణమునకు తా విష్వక్ ... గించిన
ద్రవ్యయజమానిని తాడనోపాయమున భయభ్రాంతునిగ చే
యుటయు నిట్టిదుష్కార్యాచరణమునకు ముఖ్యకారణములై యుం
డెనుగాని ద్రవ్యము గోల్పోవుటయును దెబ్బలుపడుటయును,
అనుభవించవలసిన దుఃఖానుభవమాతని ... యును, అట్టి
యనుభవకాలము మీరిపోవుచున్నదనియును, తానీతనికి పూను
కుని వానిదుష్టకర్మ ననుభవమునకు దెత్తుననుటయును తానీయను
భవమును వానికి కలుగజేయునెడల వానికవచ్చు అనుభవము
నకు దారి కానరాదనియును ఇత్యాది పరిజ్ఞాన పరితాపము లట్టి
దుష్కార్యాచరణమునకు ముఖ్యకారణములుగా లేవనుసంగతి కు
తర్కవాదియుగూడ వప్పుకొనదగిన విషయమే యైయున్నది.

తానుగాని మరియొకరుగాని యిట్లాచరింపకపోయినచో
వానికి కర్మఫల మనుభవమున కెట్లువచ్చుననియు వానికర్మను
వానియనుభవమునకు తెచ్చినవానికి పాపమెట్లుసంఘటించుననియు
కుతర్కమునకు సిద్ధపడును. ప్రతిమనుజునకును అనుభవమునకు

వచ్చు సుఖముగాని దుఃఖముగాని పూర్వ కర్మఫలానుభవము నియు తాము చేయు పనులెల్లను ముందనుభవించతగిన ఫలము లకు కారణబీజములనియు నమ్మవలెను. అనుభవమునకువచ్చు కర్మఫలము ఇచ్ఛాప్రారబ్ధము, అనిచ్ఛాప్రారబ్ధము, పరేచ్ఛా ప్రారబ్ధము నని మూడువిధములుగ నున్నట్టు లెరుంగవలయును. ఇచ్ఛాప్రారబ్ధమనగా తనయిష్టముమీద తన ప్రయత్నమూల మునసే యనుభవించునది. ఇది తరుచుగ సుఖానుభవవిషయమై కన్పట్టుచుండును. ఒకానొకసమయములయందు దుఃఖానుభవవి షయమై కూడ స్వప్రయత్నము జరుగుచునే యుండును. ఎట్లం టే కొన్నికారణములవలన తాను గాయములు కొట్టుకొనుట, జలప్రవాహమునపడుట, చెట్లు మొదలగునవి యెక్కిపడుట మొ దలగునవి. అనిచ్ఛాప్రారబ్ధమనగా తనకిచ్ఛలేక తనప్రయత్న ముగాని యితరులప్రయత్నముగాని లేనిదే, సుఖదుఃఖానుభవ ములు కలుగును. పాతుదొరకుట, చెట్లు మొదలగునవి విరిగి మీదపడుట, కాలుజారిపడుట, వ్యాధిగ్రస్తుడగుట మొదలగునవి పరేచ్ఛాప్రారబ్ధమనగా యితరుల ప్రయత్నములమీద తనకు కలిగెడి సుఖదుఃఖానుభవములు ఇతరులు బుద్ధిపూర్వకముగా భూమి మొదలగునవి యిచ్చుట, పరిచర్యలుచేయుట, కొట్టుట, ద్రవ్యాపహారణముచేయుట మున్నగునవి.

ఈ ప్రకారము ప్రారబ్ధము మూడు విధములలో నేదో యొకరీతిని యనుభవమునకు రానేవచ్చును. గాని పరులను భవ మునకు తెచ్చినసేగాని రాకమాను నట్టిదికాదు. ఈమూడుతెర గులలో నెత్తెరంగున యనుభవమునకు వచ్చినను అనుభవించు వాడు తనకు విధియైన కర్మానుభవమే యని సమ్మతించ వలెను గాని, పరేచ్ఛా రూపముగ నొకనికి కర్మ యనుభవమునకు రా

చ్చిన పరుని యొక్క ప్రయత్నము న్యాయమై పుణ్యమునకు
సంబధించినను అన్యాయమై పాపమునకు సంబంధించినను అట్టి
పుణ్యకర్మఫలమునుగాని, పాపకర్మఫలమునుగాని అనుభవించితీరవ
లెను. ద్రవ్యాపహరణ రీత్యావాని దుఃఖకర్మఫలమును వాని
యనుభవమునకు తెచ్చుటచే తనకు పాపములేదని చెప్పెయెడల
మరియొకసందర్భమున ద్రవ్యమిచ్చుటచే వాని సుఖకర్మఫలమును
వానియనుభవమునకు తెచ్చినవాడగుటంజేసి తనకు పుణ్యకర్మఫ
లము లేదనికూడ యొప్పుకొనవలసివచ్చును. చేయుబూనిన వాద
నను నిలబెట్టుకొనుట కట్టి పుణ్యము కూడలేదని యొప్పుకొనినను
సరికాదు. పగద్రవ్యాప హరణమున పాపముగాని పరులకు ధనమొ
సంగుటవలన పుణ్యముగాని లభించుటలేనియెడల నిక యేసందర్భ
మునందునుపుణ్యపాప విచక్షతయే లేకుండవలసివచ్చి పశు పక్షి సరీ
సృపాదులవలె కర్మానుభవమునకు మాత్రమే మానవుడు జన్మ
నెత్తి నట్లగును. పశుపక్షి సరీసృపాదులకంటె నెక్కుడు పరికర
ములతో నుత్పన్నమగుటవలన యెంచనగు మానవజన్మయొక్క
శ్రేష్టత్వమునకే హానిసిద్ధించును. కావున తానాచరించిన ప్రతి
కర్మకు నొకఫలముండుననియు తాననుభవించెడి ప్రతి యనుభవ
మునకు నొక కర్మయుండెననియు నిశ్చయించుట నిర్వివాదాం
శము మరికొందరు సోమరులొక యుక్తిని సంపాదించుచున్నారు.
ఏమంటే, తాను చేసిన కర్మయొక్క ఫలమే యనుభవమునకు
వచ్చునప్పుడు తామిపుడు తిరుగ ప్రయత్నము చేయునవసరము
లేదనియు ననుభవించ వలసిన కారణ మున్నపుడు ప్రయ
త్నముచేసిన నేమిచేయకపోయిననేమి యనియు ప్రయత్నము
చేసినంతమాత్రమున ననుభవించవలసిన పూర్వకర్మ లేపునదట్టి
ప్రయత్నలాభ మేమియనియు పలుకుచున్నారు. ఇట్లూహించుట

సరికాదు. కర్మపరిజ్ఞానము సరిగా లేకపోవుటవలన నిట్టిసందేహ ములు వొడముచుండును. అనుభవించవలసిన కర్మ ననుభవించుటకుమాత్రమే పుట్టినవి పశుపక్షిసరీసృపాది సమస్త జీవరాసులునై యున్నవి. వాటికి అనుభవమునకు తగిన నిద్రాహార మైథునాదులు మాత్రమె వ్యాపారములుగా కల్పింపబడి తద్వ్యాపారసాధనలకుం దగిన యింద్రియాదులను మాత్రమె భగవంతుఁడు నిర్మించియున్నాఁడు. గాని పుణ్యాపాపవివేచనా సమర్థతయు తత్తదనుకూలకర్మల నాచరించెడి ప్రజ్ఞయు కలుగచేయలేదు. కావున వాటికి కేవలము కర్మ ననుభవించుటయేగాని పునఃప్రయత్న మవసరములేదు. మనుష్యజాతికి యుక్తాయుక్త వివేచనాది ప్రజ్ఞలును తత్తదవసర న్యాయాచరణంబుల నేయు సమర్థతయు సమకూర్చిన కారణమున కర్మఫల మనుభవించుటయేగాక పుణ్యాపాపవిచారణ సలుపుచు పాపకృత్యముల విడనాడుటయు పుణ్యకృత్యముల నాచరించుటయు భగవద్భక్తి మున్నగు న్యాయావసర జ్ఞానసాధనములగు ప్రయత్నాచరణల సలుపుచుండుట విధాయకమై యున్నది. అట్లు చేయనియెడల పశుపక్ష్యాది జీవరాసులతో సమానుడగును. మరియు కర్మానుభవానంతరము జ్ఞానరహితుడగుటచే తాను తిరిగి జన్మ నెత్తవలసి తానుచేసిన కర్మ లేకపోవుటచే అనుభోగపదార్థావసరములేని పాషాణాదిజన్మల నొందవలసివచ్చును జ్ఞానసిధ్యనంతరము కర్మ నాచరింపకపోయినను జ్ఞాని అనగా పరబ్రహ్మతత్వము నెరిగినవాడగుటవల్లన మోక్షము సిద్ధించును. ఇట్లున్నను జ్ఞానియైన పిమ్మటగూడ కర్మల నాచరించుటయె విధాయకమై యున్నది. జ్ఞానియైనపుడు కర్మల నాచరించుటచే తిరిగి యనుభవించవలసి వచ్చుననియు, కర్మానుభవము పరంపరగా వచ్చుచుండ మోక్ష

మెట్లు సిద్ధించుననియు నందురేమో అట్టి సందేహ మక్కరలేదు. యేకర్మ నాచరించినను నిష్కామనయా అనగా చేయునట్టి కర్మ యొక్క ఫలము తన కక్కరలేదనెడి సమ్మతితో చేసిన యట్టి కర్మయొక్క ఫలము తన యనుభవమునకు రాదు. ఇట్లు చెప్పటచే దుష్కర్మ నాచరించి యందుల ఫలము తన కక్కరలేదని యనినంతమాత్రమున తప్పిపోవునని యెంచకూడదు. యేమను జనకైనను తనకు లోకులీయవలసిన పైకమును వదలుకొనుటకు స్వాతంత్ర్యమును హక్కును కలిగియుండును గాని, తాను లోకుల కీయవలసిన ద్రవ్యమును నేనీయనని చెప్పుటకు స్వాతంత్ర్యములేదు. అట్లనె తాను పొందతగిన సుఖఫలము తన సొత్తగుటవలన వదలుకొనిన వదలిపోవునుగాని తా ననుభవించవలసిన దుఃఖఫలము తనకు శిక్షారూపకమైనందున తన కక్కరలేదనినంతమాత్రమున విడువదు. పరస్త్రీ సంభోగాది దుష్క్రియ లాచరించిన మానవుడు బుద్ధిః కర్మానుసారిణి అను న్యాయముచే తన యనుభవమునకువచ్చు పరస్త్రీసంభోగాది సాధనలయందు బుద్ధి స్ఫురణయు తన్నియమిత యత్నములును జరుగుచుండ తన స్వాతంత్ర్య మెట్లు నిలుచునని ప్రశ్నించును. బుద్ధివేరును, తన స్వాతంత్ర్యము వేరునని యెరింగినమనుజుడు న్యాయావసరాతిరిక్తకార్యములయందు తన స్వాతంత్ర్యశక్తిచే బుద్ధిదౌర్బల్యము నడచి పరస్త్రీ సంభోగాది దుష్క్రియల విషయమున జరుగబడెడి తనస్వీయప్రయత్నములను తన కోరికలను వదలివేయవలెను. అట్లు స్వేచ్ఛాప్రయత్నములను వదలినపిమ్మట పరస్త్రీసంభోగాదులు తన యనుభవమునకు విధియైనయెడల వనిచ్ఛా పరేచ్ఛా ప్రారబ్ధ రూపములలో నేదో యొకరీతిని యనుభవమునకు వచ్చును. అట్లు తన యిచ్ఛాప్రయత్న

రాహిత్యముగ వచ్చినందున పూర్వకర్మానుభవమనియు నందు వలన తాను పాపమొనరించినవాడు కాలేదనియు చెప్పవచ్చును. అనగా అనిచ్ఛా పరేచ్ఛా రూపముల పరస్త్రీపురుష సంభోగానందానుభవ మెన్నడును కలుగదని సిద్ధాంతము. కావున తనచే కోరబడి తనచే ప్రయత్నింపబడి తనచే చేయబడిన దుష్ట కర్మాచరణము కర్మానుసారియైన బుద్ధి ప్రేరణాశక్తియనియు తాను చేయవలసిన పని లేదనియు చెప్పుట యవివేకము. ఇట్లు నిర్ధారణ చేయబడుటచేత "బుద్ధిః కర్మానుసారిణి" యను ఆర్యానుభవోక్తిని పూర్వపక్షము చేయరాదు. అది యనుభవమునకు తగిన సిద్ధాంత వాక్యమే అయియున్నది గాని యిట్టి దుష్క్రియల నుద్దేశించి "బుద్ధిః కర్మానుసారిణి" యను మహా వాక్యము చెప్పబడలేదని యభిప్రాయము. కొన్ని సందర్భముల యందా మహావాక్యము కడుంగడు విశ్వాసార్హము. ఎట్లంటే, తనకు న్యాయావసరములగు శరీరసంరక్షణార్థము తరుచ్ఛాయ నపేక్షించి తత్తరుమూలమున శయనించియుండ విషజంతువులచే హింసింపబడుట, జలప్రవాహమున కొట్టుకొనిపోవు ప్రాణిని సంరక్షించుకొరకు తాను జలప్రవాహమున దిగి చిక్కుపడుట, తనచే ప్రేమించబడు తనమిత్రునికపటోపాయంబుల దలంపబోక వానిచే పరాభవింపబడుట యున్నగు న్యాయావసరములును ధర్మయుతములు నగు కార్యములయందు ధర్మైకదృష్టితో చేసిన ప్రయత్నములను భవకాలానుసరణిని విషయంబులై యనిచ్ఛా పరేచ్ఛా ప్రారబ్ధంబు లనుభవమునకు వచ్చుతరిని బుద్ధిః కర్మానుసారిణియను వాక్యము సార్థకమగును. ఈచెప్పబడిన యనుభవములు అనిచ్ఛా పరేచ్ఛా ప్రారబ్ధములైనను తనప్రయత్నముకూడ కొంత కలదు. అయితే ధర్మవిరుద్ధముకాని న్యా

యావసరవిషయమందెందు వేరు ఫలాపేక్షయా తానుప్రయత్నము చేసినవాడై వ్యతిరేకఫల మనుభవించినవాడగుచున్నాడు ఎట్లయినను దుఃఖఫలమే కార్యావలంబనమున వచ్చెనో యా కార్యమును సదుద్దేశ్యముతోనైనను చేయ ప్రేరణచేసినది బుద్ధిగనుక "బుద్ధిః కర్మానుసారిణీ" యను మహావాక్యమును సిద్ధాంతపరుపవచ్చును.

తనకు కలిగిన యనుభవమెల్ల పూర్వకర్మఫలమని సిద్ధాంతపరచినప్పుడు పరస్త్రీ సంభోగానందానుభవము తన పూర్వకర్మ ఫలమనియును తదనుభవము స్వేచ్ఛా పరేచ్ఛా మిళితమైన తనయొక్కయు తనకు సంభోగానందమును కలుగజేసిన పరస్త్రీ యొక్కయు పరస్పర ప్రయత్నోపాదములు కారణము లయ్యెననియును అందువలన పరస్త్రీసంభోగము నూతనముగా చేయబడెడి దుష్కృత మెట్లయ్యెననియును కొందరు మూర్ఖులు ప్రశ్నింతురు. ఈ సందర్భమున పరస్త్రీసంభోగము పూర్వకర్మానుగుణ ఫలానుభవమా! యిప్పటిదుష్కర్మయా! అనువిషయము సరిగా నిర్ధారణ చేయబడినచో యిట్లు ప్రశ్నించుట కాధారముండదు. ఎట్లంటే-పరస్త్రీసంభోగమునకు చేయబడిన తనయొక్కయు, తనకనుకూలించిన స్త్రీయొక్కయు వివిధప్రయత్నములు న్యాయ్యావసరాతిరిక్తముగ మానవోచితధర్మవిరుద్ధములైనందున తద్దుష్ప్రయత్నముల వలన సాధించబడిన సంభోగానందము దుఃఖానుభవమునకై నాటబడిన దుష్కర్మబీజములని స్పష్టపడను. గాని పరస్త్రీ సంభోగానందము పూర్వకర్మానుభవమని యెంచుటకవకాశముండదు. ఇందుపైన నొకపెద్దకుయుక్తిని కొందరు కల్పించవచ్చును. ఎట్లంటే-పశువులు మొదలైన పరేంగితాదిపరిపూర్ణజ్ఞానయుతములుకాని జీవజంతువులను, తరుశిలఘనకనకాది

జడపదార్థములను అపహరించెడి పట్లనట్టి జీవజంతువులు లేక వస్తువులు అపహరించెడివానికి తదపహరణము తమకు సమ్మతమే యని చెప్పజాలవు. గనుక వాటియజమాని యనుజ్ఞ లేకయే తీసుకొనిపోవుట చోరత్వ దుష్కృతముగ నారోపణచేసినరీతిని పర స్త్రీ పరపురుషులు చేతనులై పరేంగితాది పరిజ్ఞానయుతులై పురుషునియెడ స్త్రీయును స్త్రీయెడ పురుషుడును పరస్పరానురాగామోదముల నొంది యొకరి కోర్కెల కొకరు సహాయులై యుండుటతటస్థించి అట్టి పరస్పరానురాగామోదములపరిణామమే సంభోగానందానుభవమగుచుండుటంజేసి జారత్వదుష్కృతముగ నెంచగూడదని వాదించును. ఇదివిషయనికరణమునవిమర్శించినచో యీవాదన సూక్ష్మముగ ఖండింపబడును. అపహరణపట్ల తమ సమ్మతిని తెలుపలేనివగుటవలన పశ్వాదుల విషయమునను జడ పదార్థముల విషయమునను యజమాని యుద్దేశ్యమునకు వ్యతిరిక్తముగ నపహరించుట చోరత్వ దుష్కృతమని యెరింగిన మానవులు చేతనులై పరేంగితాది ప్రజ్ఞలు కలవారైయైనను సంభోగానంద విషయమున ప్రతి పురుషునకు నొక స్త్రీయును ప్రతి స్త్రీకి నొకపురుషుడును మాత్రమే అనుభవార్హులుగ నియమింపబడి యుండురనియు నుండి తీరవలెననియు తద్వ్యతిరిక్తము సాంకర్య కారణమనియు, అనారోగ్యప్రదమనియు, నెరింగి పురుషులపట్ల స్త్రీలును స్త్రీలపట్ల పురుషులును తన్నియమితానుభవార్హుల నతిక్రమించియు నతిక్రమింప జేసియు నొనర్చెడి పర స్త్రీ పరపురుష సంయోగానురాగాది ప్రయత్నములు జారత్వదుష్కృతమని సులభముగ దెలుసుకొన దగియున్నది. అందువలననే ఇట్టి దుష్కృతము మహాపాపమనియును ఘోర దుఃఖానుభవ కారణమనియును పెక్కుశాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

ఇది నిశ్చితమైన కర్మ రహస్యమై యున్నది. కావున కర్మయొక్క పద్ధతియు నట్టి కర్మ యనుభవమునకు వచ్చు తెరం గును, తత్తదనుభవభేదములును, కర్మను త్యజించుటవలన కలుగ నయ్యెడు ఫలమును, కర్మ నాచరించవలసిన ప్రాముఖ్యతయు, నిష్కామకర్మవివరమును,బుద్ధిఃకర్మానుసారిణియనుమహావాక్యసమ న్వయమును సంపూర్ణానుభవార్థముగ తెలుసుకొని కర్మాను భవమునందు వగపులేక సమత్వసంతుష్టాంతరంగుడై న్యాయా వసర కృత్యంబుల నాచరించుచుండు మానవునకు రాను రాను పూర్వ కర్మానుభవ మనుభవకారణమున క్షయమైపోవ తా నాచరించుచుండు న్యాయావసర సంకల్ప కృత్యమ్ములే ఫలవంత ములై యనుభవమునకు వచ్చుచుండును. ఇట్టి న్యాయావసర కర్మలద్వారా వచ్చెడి యనుభవము దుఃఖభాజనముగాక సౌఖ్య దాయకమై జ్ఞానసాధన కారణమై జ్ఞానసిద్ధిని కలిగించి ముక్తి నొసంగును. పూర్వకర్మానుగుణమైన దుఃఖానుభవ శేష మున్నం త వరకును, ఎంత న్యాయావసరకర్మల నాచరించుచున్నను వాటి మధ్య మధ్య విధ్యుక్త కాలానుసరణిగ దుఃఖానుభవములు వచ్చుచుండుటయెగాక కొన్ని సందర్భములలో న్యాయావసర ప్రయత్నములనుకూడ సఫలములు కానీయవు. అట్టిసమయము లందెంతటి బుద్ధిశాలికైనను న్యాయావసర యత్నములు సఫల ములు కాకపోయె ననియు, చిక్కులు వాటిల్లె ననియు చింత నొందమి, పైన వివరించిన కర్మరహస్య మునమన్వయమునకురాక సత్కార్యాచరణను వదలబూనను, అట్లుమతిభ్రమనొందదగదు. కొన్ని సందర్భములయందు న్యాయావసరయత్నములుగూడ సఫ లములు కాకపోవుటకు పూర్వ దుఃఖానుభవ కర్మయే కారణ మగుచుండును. ఎట్లనగా కృషి వాణిజ్య రూపముల ధనము

నార్జించు మానవుడు తానార్జించు ధనముకన్న నంతకు మున్నే చేసిన ఋణమెక్కుడగుటవలన తదృణవిముక్తికై వెచ్చించ బడి, యాదాయమునకు మిగలని తనయార్జనన్ముగురించివిసుకుపడి, కృషివాణిజ్యాది వ్యాపారములు లాభకారులుకావని తలంచును అట్లు తలంచినంతనె నిజముకాలేదు. కృషివాణిజ్యాదివ్యాపారములలో లాభము వచ్చినది గాని ఆదాయమునకు మాత్రము రాకఋణమునకై పోయినది. కేవల మాదాయమునే కోరిన వాడగుటవలన ఫలములేకపోయెనని వగచుచుండును. అట్లనే తన ప్రయత్నమెంత న్యాయావసరమైనదిగానున్నను, అట్టియత్న కార్యఫల మనుభవించుటకు వీలులేనంతటి దుష్టకర్మానుభవము కలిగియున్నపుడట్టి ప్రయత్నము నెరవేరకపోవచ్చును. గనుక నిశ్చయముగ పూర్వ దుష్ట కర్మానుభవమగువరకు నిట్టి దుఃఖానుభవములును, కొన్నిసందర్భములయందు న్యాయావసర యత్నకార్యవిఘ్నంబులును వాటిల్లుచుండును. ఇంతియెకాని సత్కార్యములను సుగుణముల నవలంబించిన నాపదలు కలుగునని భీతి నొంద నవసరములేదు. పూర్వకర్మఫల మనుభవమునకువచ్చుటకొక ప్రేరణ అనగా, కారణముగా వేరొకకల్పితము కానవచ్చు చుండును.

ఎందువల్లనంటే అనిచ్ఛాప్రారబ్ధానుభవముగాక మిగత ద్వివిధప్రారబ్ధానుభవములకును పురుషప్రయత్నములే కారణములై నందున ఇచ్ఛాప్రారబ్ధ మనుభవించుటకు స్వప్రయత్నమును పరేచ్ఛాప్రారబ్ధ మనుభవించుటకు పరుల ప్రయత్నమును చాలవరకు తాత్కాలికకార్య సందర్భాను సారములు గనవసరములై నట్లు కాన్పించుచుండును. ఎట్లంటే, నన్నుకారణముగ తిట్టినందున, వానినినేను కొట్టితిననియు, నాకిచ్చెదనన్నపైక మీయుటం

దున వానిభూమినమ్మించితిననియు వ్యాధినిసహించలేక స్వయముగ, విషమును ద్రావితిననియు, నిత్యాదిలౌకిక కారణములు ప్రపంచవ్యావహారిక సందర్భానుసారముగ పైకి కానవచ్చుచుండును. గాని కర్మానుభవమున దెబ్బలు పడుటయు భూమిని కోల్పోవుటయు విషమునుద్రావుటయు తటస్థములైనవి. తత్కృత్యములనొనరించిన మానవుడు పారమార్థికన్యాయావసరరహితుడగునేని తత్కర్మానుగుణ దుఃఖఫలమును తిరిగి యనుభవించ తగినవాడగును. గనుక నేప్రతిమానవుడును తనయనుభవమునకు వచ్చు ప్రతికర్మఫలమును అనిచ్ఛారూపముననేయనుభవమునకు వచ్చునట్లు చేసుకొనినచో కర్మానుభవ బలరహస్యమును స్పష్టముగ నెరుగగలడు. అట్లు ప్రారబ్ధము అనిచ్ఛారూపమున మాత్రమె యనుభవమునకు వచ్చుటకును స్వేచ్ఛాపరేచ్ఛారూపములరాకుండుటకును చేయుతగిన ప్రయత్నము లేపియనిన ప్రతిమానవుడును న్యాయావసర కార్యములను మాత్రమె చేయుచుండుటయేగాని వేరేమియునులేదు. ఒకనిని హింసించుట లేక మనస్సును చిక్కుపరచుట మొదలగు కార్యములు న్యాయావసర విరుద్ధములనియు, నిజోదరాది పోషణలకై న్యాయైక ద్రవ్యము నార్జించుట, భగవద్భక్తి, పరోపకార చింతనము, మున్నగునవి, న్యాయావసరకృత్యములనియు నెరుంగునది. పరోపకారముల వలన నొకనికి పరేచ్ఛాప్రారబ్ధ మనుభవమునకు రాలేదాయని తోచవచ్చును. అట్లు వచ్చినను అనుభవించిన వానికి దుఃఖానుభవముకాక పోవుటవలన వాని మనస్సునకు కలవరముకలుగక పోవుటయు నట్టి కర్మనాచరించిన వానికి తిరిగి దుఃఖానుభవము రావలసిన యవసరములేనందున నిష్కామనయా చేసినదైన మొదలనే యనుభవములేక పోవుటయు సకామనయా చేసినదైన

యెడల సౌఖ్యానుభవము కలుగుటయు తటస్థమౌను. సౌఖ్యానుభవమున సంతసమును మనోల్లాసమును కలిగి తానుపూనిన న్యాయావసరానుగుణ సత్కార్యాభిలాష క్రమాభి వృద్ధినొందియంతయు సౌఖ్యకర్మానుభవమే యైనందున యిహసౌఖ్యమును అన్నియు న్యాయావసరానుగుణ సత్కార్యాచరణలే యైనందున జ్ఞానసిద్ధియు తద్వారా మోక్షప్రాప్తియు కలుగుచుండును. ఇట్టి ధర్మసూక్ష్మము నుగురుతించలేక న్యాయావసరముల నెరుంగక తోచినట్లెల్ల నాచరించుట జనులలో ప్రబలినకొలదిని అన్నియు పరేచ్ఛా స్వేచ్ఛా ప్రేరణలైన దుఃఖకర్మానుభవములేయై మనస్సంతాపము నొంది పరులుచేసిరనెడి యీర్ష్యాసూయల నవలంబించి లౌకిక వ్యవహార పరిజ్ఞానముచే నొకరికొకరు పునః పునః దుష్టకర్మల నాచరించుకొనుచు నిహపరసౌఖ్యములకు దూరులగుచున్నారు. చీకటిలోనున్న ప్రతిమనుజూచి మనుజుడనియు త్రాడునుచూచి సర్పమనియు భ్రాంతినొందిన తీరుగను, పైత్యరోగి మధురపదార్థములను చేదుగనెంచిన విధముగను, కర్మసిద్ధాంత రహస్యమనెడివెలుగు నవలంబించనిబుద్ధితో న్యాయావసరనిర్ధారణచేయ జాలక పోవుటచే స్వేచ్ఛావిహారుడనియెడి పైత్యరోగి నిజవస్తునిరూపణ చేయులేనిభంగి పురాకృతమైనయనుభవకర్మ నిప్పటి వ్యవహారోత్పాదిత వైషమ్యాదులచే కల్పింపబడినదని పరులయం దారోపించుచు తత్ప్రతిహతమని యెంచి తదభివృద్ధికరములైన దుష్కర్మలం దిరిగి యాచరించుచుండును. ఇట్లు రాను రాను మనుష్యజీవితమంతయు నాపదలకాస్పదమైన దుఃఖానుభవమే ప్రబలును ఇంతియెకాని సత్కార్యాచరణమున నాపదలు వాటిల్లవు. హరిశ్చంద్రునకు విశ్వామిత్రునివలన నిక్కట్టులు వచ్చెననుటయు, సారంగధరునకు పిన

తల్లివలన కరపాదఖండన మొనర్పబడెననుటయు, ప్రహ్లాదునకు తండ్రివలన బాధలు వాటిల్లెననుటయు, నిత్యాదిపైన వివరింప బడిన మహాపురుషులకు తటస్థమైన యాపదలన్నియు వారి వారి పూర్వకర్మానుభవములే గాని వేరుకాదు. పరేచ్ఛారూపమున యనుభవమునకు వచ్చినవగుటవలన పరులు చేసిరనియు, సత్కా-ర్యావలంబన చేయుబడిన సమయమున నట్టి దుఃఖానుభవము సిద్ధపడినందున సత్కా-ర్యావలంబనచే కలిగినవనియు చెప్పకొనుట కును పామరులు నమ్ముటకును అవకాశము కలిగినది. ఇట్టి సంభావనలు నిశ్చితమగు కర్మరహస్యమెరుగని లౌకిక వ్యవహారాను గుణసంభావణలై యున్నవి. కావున నీసద్గ్రంధపాఠకమహాశయులందరు నిట్టి యనిశ్చితార్థ సంభావణలను నమ్మి మనస్సులను కలవరపరచుకొనక న్యాయావసరాతిరిక్తకార్యముల విడనాడి నిరంతర న్యాయావసర నిబద్ధ సత్కార్యావలంబులై కర్మఫలానుభవకాలములయందు మోదఖేదములు లేని సమత్వసంతుష్టాంతరంగులై యిహపరసౌఖ్యముల నార్జింతురు గాత. సర్వేజనా స్సుఖినోభవంతు మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఉ॥ సంతసమొప్ప సేతుహిమశైలతలాంతరసర్వదేశ సం
క్రాంతవిహార మబ్జభవకల్ప చిరాయువు దగ్గిగంత వి
శ్రాంత నితాంత సద్యశము సర్వజనప్రకరానుమోదముం
సంతత మూ పరాత్పరుడు సత్కృప నీకృతికిచ్చి ప్రోచుతః॥

ఇతి

శ్రీమదిందిరా సుందరీరమణ చరణారవింద నిరంతరధ్యాన
హృదయ కమలుండును. గౌతమసగోత్రసంభవ
గుడిగుంట వంశపయోధిచంద్ర అంతయా
మాత్య ద్వితీయ పుత్రుండునగు
లక్ష్మీపతి ప్రణీతంబైన కర్మాను
భవ పరిజ్ఞానవచన కావ్యము
సర్వమ్మును
సంపూర్ణము.

